PRAHASANUM SERIES NO. 2.

# MAHAYOGA RAHASYAM



# మహాయోగరహస్యప్రహసనము.

## Vice Condemned.



BY

**RAJA M. BHUJANGA RAU,**

**BAHADUR, ZAMINDAR,**

ELLORE.

SECOND EDITION.

THE MANJUVANI PRESS.

1904.

 [*Price 2 Annas.*

*Printed by N. ChalapatiRau.*

శ్రీరస్తు.

# మహాయోగరహస్యప్రహసనము.



ఇది.

అష్టావధాని

శ్రీరాజా మంత్రిప్రగడ భుజంగరావు

బహద్దరు జమీందారుచే

రచియింపఁబడినది.



1904

మంజువాణీ ముద్రాక్షరశాల

ఏలూరు.

రెండవతూరి 1000 కాపీలు.

వెల 2 అణాలు.




# మార్కండేయస్వామినేనమః.



## శ్లోకము.

శ్రీమధ్యాయామి మిధ్యాచక వికచచ్చైచ్ఛ్య సత్యస్వరూపమ్।
హృద్యం సన్మాని వేద్యం శ్రుతిమహితసతీ భాగ్యసౌభాగ్యకందమ్।
సిద్ధం సర్వానువిద్ధం పరమశివమయం భవ్యదివ్యప్రకాశమ్।
మార్కండేయేశ్వరాఖ్యం నతజనసుఖదం భాగధేయం మదీయమ్॥





# ఇందువచ్చుపాత్రలు.

## పురుషులు.

1. యోగి-కథానాయకుఁడగు వెంకన్న.
2. వీరాస్వామి-వంచకుఁడు.
3. షుబేదారు-వీరాస్వామి స్నేహితుఁడు.
4. సిద్దైయ్య-షుబేదారుస్నేహితుఁడు.
5. వెంకోజీపంతులు-షుబేదారుసిద్దైయ్యలకుగురువు.
6. అవధూత-వేదాంతి
7. క్రిష్ణారావు-అవధూతశిష్యుఁడు.
8. లక్ష్మయ్య-వెంకన్నయూరివాఁడు.
9. పరమహంస మహాయోగి.
10. రామప్ప-పరమహంసశిష్యుఁడు.

## స్త్రీలు.

1. లక్ష్మమ్మ-వెంకోజీపంతులుభార్య.
2. వెంకాయి-ఒకపడుచుస్త్రీ
3. నాగరత్నము-వెంకాయిస్నేహితురాలు.
4. విశాలాక్షి-పంతులుశిష్యురాలు.
5. సుందరము-విశాలాక్షిస్నేహితురాలు.

శ్రీరస్తు.

# మహాయోగరహస్యప్రహసనము.



## రంగము—ఏలూరుసత్తెయ్యనాయుడుగారి తోటచాయలు.

కాకాయని పక్షికులసహస్రంబు లరుణోదయరహస్యమును వెల్లడి చేయనో వారోదలు చేయుచుండెను. ఝుమ్మనిమూగు తుమ్మెదల దిమ్ములనులికిపడి లేచినట్లు పల్లవులచాటులనున్న ప్రసవములు విచ్చుచుండెను. వాసంతిక తరునికరములు చివురుబాణముల సంధించి వసంతాగమము నిరీక్షించుచు మనోహరముగా నుండెను. రేపకడ పతులతో నతులగతి రతిపరిశ్రమనొందిన సారసనేత్రల చిగురుచెమ్మటల నార్పుటకో యన, మందమారుతము పరిమళపరిమిళితమ్మగు పుష్పగంధవహమయి వీవఁ జొచ్చెను. అంత దిగ్రపశయమును సూచించుచు నరుణోదయము దశదిశల నలంకరించె. లేజివురు మెక్కిన మైమరపుచే నోడలెఱుఁగక కూయు వనపుంస్కోకిలారావములకు మారెలుంగు లిచ్చుచు వారిజనేత్రలు తిరుగసాగిరి. లేలిహానముల చాడ్పున బైసికిలు బండ్ల నెక్కి కొందరు పోవుచుండిరి. గుఱ్ఱపుబండ్ల నెక్కి వంతెనయంతయు నదురునట్లు మన్నుమిన్నేకముగా భూమి గజగజ వడంకునట్లు పరువులెత్తించుచు, గొందఱు ప్రముఖులు వెడలుచుండిరి. వంతెనక్రింది కాల్వలలో గడలు వేయుచు, పడవల నడుపుచుండిరి. నీళ్ళబిందెల బుజముపై పెట్టుకొని స్త్రీలనేకులు ప్రసంగములు చేసికొనుచు నడచుచుండిరి ఎటుచూచినను ప్రపంచమంతయు నొక్కసారి జీవవంతమైనట్లు కన్పట్టె.

(అప్పుడు నీళ్ళబిందెలతో వెంకాయి, లక్ష్మమ్మ ప్రవేశించుచున్నారు)

వెంకా—ఏమమ్మా అక్కా! ఇవాళేకామల్లు మూడువందల యేండ్ల మహాయోగి వచ్చేది. మూడువందలయేండ్లు యెలాబ్రతికాడో? అదినాకుతెలిసివుంటే యీపాటికి మా అమ్మను చచ్చిపోకుండా బ్రతికించేదాన్నే. నిజంగా మూడువందలయేండ్లమ్మా!

లక్ష్మ—మూడువందలయేండ్లమాట నిజమేట మా ఆయన రాత్రి యింకెవరో అయిదువందలయేండ్ల మహాయోగి కూడావున్నారన్నారన్నారు. ఇవాళ రావటము నిజమే. అందుకనే మా ఆయన నన్ను పెందలాడే వంటచేయుమన్నారు.

వెంకా—ఇదుగో నమ్మాయి. ఆ కేక్కమవుతుందోగాని వూరంతా యిట్టుకు అట్టుడికినట్టుడికిపోతున్నది

లక్ష్మ—ఏమీకావటమేమిటి? ఇవాళ రానేవస్తాడు.

వెంకా—అవును, నిజమే. ఆయనకేమి యెడ్లు కదలాలా, బండ్లుకదలాలా? "జయపరమేశ్వరా" అని యెప్పుడు తలుచుకుంటే అప్పుడే వచ్చివాల్తాడు

లక్ష్మ—అమ్మాయి నే వెడతా, మళ్ళీఅలస్యమయితే చంపుతాడు, వూళ్ళో పెళ్ళి కుక్కలకడావిడి అన్నట్టు యే వేదాంతు లొచ్చినా మా కొంపమీదికే వస్తుంది, మరీ మాకోసు వేదాంతదారి కాడు, ఆతగాడి వల్ల సంసారం కుంపయిపోతున్నది,

వెంకా—నిజమే, ఒక్కరు పట్టుకొని మిడికితే యేమయినట్టు అదుగో నాగరత్నము వాండ్లు వస్తున్నారు, నే వాళ్ళతో వస్తా వెళ్ళండి.

(అప్పుడు నాగరత్నము మొదలుకొందఱుస్త్రీలు వచ్చుచున్నారు)

నాగ—ఓహో! వెంకాయి కాంబోలు, ఎన్నాళ్ళ కగుపడ్డావే. ఇవాళరానిచ్చిందీ మీ అత్తగారు ?

వెంకా—మా అత్తగారు వూళ్ళో లేదు, నిన్ననే విశాఖపట్టణము వెళ్ళింది,

నాగ—అలా చెప్పు అందుకనే తీరిక చేసుకొని బయలుదేరావు. ఏమిటి లక్ష్మమ్మతో మాటలాడుతున్నావు, ఆవిడె మొగుడి వేదాంతమేమయినా నీకు చెప్పతాను రమ్మన్నదా యేమిటి? వాండ్లయింట్లో కోటీశ్వరయోగియున్నాడులే, నిన్ను శిష్యురాలను కమ్మనమంటున్నదా యేమి ?

వెంకా—అబ్బే అదికాదు. మహాయోగి ముచ్చట చెప్పకుంటున్నాము, నీవువిన్నావా ?

నాగ—విన్నావా అంటా వేమిటి. ఊరంతా వుడికిపోతూ వుంటే. ఇవాళ కచ్చేరీలకన్నీ శలవు యిస్తారట, ఇస్కోళ్ళు కూడా కట్టివేస్తారట. మా ఆయన యింకా యిస్కూలుకు వెళ్ళలేదు.

వెంకా—నాగరత్నం, అన్నివందల యేండ్లున్నవాడు యెంత ముసలి తొక్కవలె వుంటాడో!

నాగ—పడుచువాడివలె వుంటాడట. ఈయన అందగాడివలెగాక నిజముగా చాలామహాత్మ్యము కలవాడేట. దొరలుకూడా అనేకమంది పరీక్షచేసి అపరాధముని లెంపలువేసుకొన్నారట.

వెంకా—అవును. ఏపుట్టలో ఏపాముందో ఎవరికి తెలుసు ? ఎంతెంత వాండ్లులేనిదీ యీప్రపంచమిల్లా నిలిచిందీ.

నాగ—ఎవరే వెంకాయీ ఆయన యిందాకటినుంచీ మన మాటలన్నీ వింటూనుంచున్నాడు ఆగట్టుమీద ?

వెంకా—మీ ఆయనబావమరిది

నాగ—మా ఆయన బావమరిదిగాడు- మీ అమలాపురం పెద్దబావ.

వెంకా—మరియెవరంటే నాకేం తెలుసునని అడిగావు ?

వాగ — మరదలవు నీకింతమాత్రము తెలియదా అనుకున్నా ఎవరయి తేనేమిలే యోగిముచ్చట చెప్పుకుంటున్నామని విన్నాడు కాఁబోలు. ఇప్పుడినో వేలం పెట్టి బయలుదేరిందిగా.

వెంకా. — వదినె నేవెడతానప్పా.

వాగ — సరే. నేనువస్తాపద.

(అమాటలవిని వీరాస్వామి యిట్లనుకొనుచున్నాఁడు)

వీరా — (తనలో) ఇదిమహామంచిసమయముగావున్నది. క్రిందబారేచీమ, పైనబొయ్యేపక్షీ యీవన్నంది యోగిమాటేచెప్పకొంటున్నారు. ఎవరినోటవిందామన్నా యిదేకబురు. షుబేదారు నేను వెళ్ళగానే నిముషములో లొంగిపోయినాడు. ఇఁక నేను బోయి వెంకన్నను మహాయోగిగా మార్చవలెను అదుగో నాకోసము వస్తానేవున్నాఁడు

[అనితోటలోనికిఁబోయి]

వీరా — నీవిఁక తిన్నఁగావుండాలి అందఱునిన్ను చూడడానికి వస్తారు జాగ్రత్త మనకపటము తెలియనియ్యఁగూడదు సుమా

యోగి — ఏమిచెయ్యమంటే అదేచేస్తాను.

వీరా — నీతిరుపతిమొక్కుకు పెంచినగోళ్ళూ తలాయిందుకు పనికివచ్చింది నీవురూటూడకనూర్చో ఎండఃబువచ్చినాసరే కన్నులుమూసుకోవాలి,

యోగి — నేనెంతసేపనిమూసుకోను? గంటకోమాటయినా తెరవకపోతే వుండలేను అదిసరే నాకు మూర్ఛవస్తే యేమిచెయ్యను? మూర్ఛతోపాటు నోటనురగపడుతుంది.

వీరా. — కన్నులుమధ్యమధ్య తెరవవచ్చును మూర్ఛమాటే — (తనలో) ఒకటికుదిరితే ఒకటికుదరదు గోళ్ళు, తల, గడ్డము యెదిగిందిగదా అనిచూస్తే మూర్ఛరోగము వకటిపట్టుకుంది. [ప్రకాశముగా] నీకుమూర్ఛయెన్నాళ్ళకోసారి వస్తూవుంటుంది

యోగి—ఎప్పుడుజడితే అప్పుడేవస్తుంది.

వీరా—పోనీ యీవాళిటికి ఆపుకోలేవు?

యోగి—ఆపుకుంటేఆగదు. మూర్ఛవచ్చేయుందరమట్టుకు నన్నుజాగ్రత్తగా కనిపెట్టాలి !

వీరా—సరేగాని ఎవరయినాపెద్దలువస్తే మూల్గాడవద్దు. అంతాకన్నుసైగచేతనే తెలియచెయ్యవలెను- అనేకవేలుమందివచ్చి పాదాలమీఁదబడతారు. బహుజాగ్రత్తగా సంచరించాలిసుమా.

యోగి—పాదాలమీఁదబడితేనాకు చక్కిలిగిలి వేస్తుంది నవ్వువస్తుందేమో ?

వీరా—రామరామ ! నీతో అన్నీచావులే-నీపుణ్యమాయిరిగానిఅల్లా చిమాన అధికాచమూవాలకని మధ్యమధ్య లేచిపోకు- అప్రతిష్టవస్తుంది-

యోగి—అబ్బో ! నాకు అసలు అతిమూత్రిం అందుకనే తల్లగడ్డము పెంచి వెంకటేశ్వరులకు మొక్కుకున్నాను. అదిమట్టుకు ఆపటం నాతరంగాదు- లేకపోతే నేను వూరికేవుంటాను నీవు యోగివిగా

వీరా—నాకుగోళ్ళు, గడ్డమువుంటే నిన్నానిన్నా బ్రహ్మలకనే పోదును- ఎలాగయినా నీవేసర్దుకోవాలి అదుగో యెవరోవస్తున్నారు- ఈతెరలోకూర్చో చంకలో పంగలకఱ్ఱ ఆనుకో జాగ్రత్త మధ్యమధ్య మాట్లాడాలంటే బ్రహ్మసత్యం- జగత్తు మిథ్య అనిమాత్రిమను- అదుగోదగ్గరకు వస్తున్నారు మాటదక్కించాలి వేలకువేలు వరషము కురుస్తుంది- నేను ముందుపాత్రిణాచారము పడతాను. కన్నులుమూసుకో-

[అప్పుడు షుబేదారు ప్రవేశించుచున్నాడు.)

వీరా—మీరా ! ఎవ్వరోఅనుకున్నాను ఇంకా తమరురాలేదనిమొ

దూరుచూస్తున్నాను- తూర్పువీధి అవధూత మహా అసాధ్యపు వేదాంతి వున్నాడట- అతఁడేమయినా చేస్తాడేమో అని భయంగావుంది. అయినా అన్నిటికి మీరేవున్నారు.

[చెవిలో నేమియో చెప్పుచున్నాడు)

షుబే— నేను వెళ్ళి వెంటఁబెట్టుకొని వస్తాను. జాగ్రతగా వుండఁడి- (తనలో) ఏదోవిధముగా అయ్యగారిని లేవదీస్తే యిఁక అంతా సాగిపోతుంది, ఇక్కడికే యెనిమిదిగంటలయింది, అయ్యగారు యింట్లోవున్నారో లేనేలేరో త్వరగా వెళ్ళవలెను-

(అనివెళ్ళి పంతులుగారి తలుపుకొట్టుచున్నాఁడు]

లక్ష్మి -(తలుపుచాటునుండిచూచి తనలో] ఈషుబేదారుతో మా సంసారం కూలిపొయ్యేయోగంవచ్చింది. పిల్లివలె అన్నీ అంటిస్తాడు, తనపించక మట్టుకు తానుదాచుకుంటాడు, ఈవెధవవేదాంతముతోనే మాకొంప మునిగింది, (తలుపుదెరచి ప్రకాశముగా] షుబేదారుగారేనా ? ఎవరో అనుకున్నాను, పంతులుగారెక్కడికో తెల్లవారుఝామున లేచివెళ్ళారు ఇంకా రాలేదు. కచేరీ పనిమీఁద వెళ్ళారేమో;

షుబే— అక్క- మంచిసమయములో నేలేరు- ఎవ్వరితో చెప్పకండి- మహాయోగివచ్చి మాసత్తెయ్యనాయుఁడిగారి తోటలోదిగాడు-

లక్ష్మి— (తనలో) నాప్రాణము గుబుకూ గుబుకూ అన్నట్టే అయింది- వూళ్ళోకి యేదివచ్చినా ముందు మాకొంపమీఁదికి వస్తుంది నేనెన్నివిధాలచెప్పినా వినఁడు. ఇక్కడికి మఁగయ్య కియ్యవలసినపద్దలాగేవుంది. ఈసంసారం ముందుకుగాదు- చెపితే అయిదు తట్లలోపం-

షుబే— అమ్మగారూ ! సిద్ధయ్యగారిని పిలుచుకొస్తానుగాని అయ్యగారువస్తే మోగివచ్చాడనిచెప్పి యింట్లోవుండమనండి.

లక్ష్మి— నా ఆజ్ఞమీఁదవుంటారా ? చెపుతాను- ఇవాళమంగయ్యబాకీ ఫయిసలు చేయిస్తు- మళ్ళీపరపతి పుట్టును.

[అప్పుడుకిర్రుచెప్పులు తొడుగుకొని వెంకోబరావు పంతులు ప్రవేశించుచున్నాడు)

వెం:—ఏమండోయి షుబేదారుగారు, ఇవాళ కైవల్యామృత సార సంగ్రహ పత్రికవచ్చిందా? ఏమేవు. ఇదుగో తలగుడ్డ అవతల బెట్టి కొంచెము తరువాణితేట తీసికొనిరా.

లక్ష్మి—(కొంచెము వినబడునట్లుగా] మీకన్నీ సాపు అలవాట్లు అబ్బుతున్నయి- బ్రాహ్మణీకం పాడయిపోయింది.

షుబే—అయ్యా గారూ! మహాయోగిగారువచ్చి మా సత్తెయ్యనాయుడుగారితోటలో దిగారు. ఎంతసాధువులండి- గొప్పమహాత్ములు- తమదర్శనప్రకారమే అయింది.

వెంకో—నేను రాత్రి ప్రసాద స్వీకార మందు చెప్పలేదూ కొంచెము దృశ్యముగా కనుపించినదని? గడ్డము గోళ్ళు బాగా యెదిగివుండాలి. కొంచెముశుష్కించినట్టు లేదూ?

షుబే--గుర్వాజ్ఞ- తమకు తెలియనిదేమున్నది, తమ కేవలంగా ద్యోతకమయిందో అంతా అదేతీరుగా వున్నది- గొప్పసత్వము వుంది లోకులు అజ్ఞానులు- తనలో జీవము తా నెఱుంగకుంటే ఆయన వున్నచోటు తెలియక రయిళ్ళ పడవలుపట్టుకొని తిరుగుతున్నారు- తమకు ముందే తెలిసినది- యోగ్యుల సహవాసము సామాన్యము గాదు-

వెంకో--వెఱ్ఱివాళ్ళు, మహాయోగులెప్పుడూ అథాత్తుగా వస్తారు గాని అట్టహాసముగా రానేరారు- వారికి లోకప్రబంధ్ధతో పనే లేదు- మనోవేగం చేత నే వస్తారు-

షుబే--గురువాజ్ఞ- ప్రొద్దెక్కుతున్నది-

వెంకో--అవధూత యివాళ రంగనాయకమ్మకు ఒప్పుకొన్నాట్ట- అతడేదో వకటి చేస్తూనేవుంటాడు- అయినా మనము రమ్మంటే రా

డా ? మొన్నటివిషయములో కొంచెము అతను నేను తలపట్లుప ట్లుకున్నాము.

షుబే—అయినాతమ అజ్ఞ అంటేవస్తాడు. ఎన్నాళ్ళ నుండో ఆశ్ర యించినదని తమతో మనవిచెయ్యకుండా చేశానని బుద్ధిపొరపా టు అని మాతో చెప్పాడు. క్షమించండి.

వెంకో—కేసుదాఖలవుతుందనివిన్నాను. అంత బలవంతము లేనకొం దుకు ?

షుబే—మంచివుద్దేశ్యముతో చేసిన జ్ఞానబోధ నేరమేనా ?

వెంకో—పినల్ కోడ్సులో అలా శిక్షవుంది సరే అతనిమాట అలా వుండనీ. మనమైనా త్వరగావెళ్ళాలి. ఏమేవు. ఏంజేస్తున్నావు వాసిప్టంతీసుకురా.

లక్ష్మ—ఏమీలేదు మంగయ్యకు బట్టలతాలూకు పైకమియ్యాలట. ఇదుగో ఈలెక్క—కాగితం యిచ్చి వారమురోజులలో సొసాయిం చకపోతే యికమాటదక్కదన్నాడు.

వెంకో—(మండిపడుచు) ఏడిశావులే అదా నిన్ను తెమ్మన్నది. నేయియ్యకపోతే నీవుయిస్తావనాయేమిటి వాడు నీతో గోడు పెట్టుకోవడం. షుబేదారుగారూ! చూశారా మంగయ్య నడత ? నాపాదంబట్టి నాతో అనేక ప్రమాణికాలుచేసి జ్ఞాన బోధ చేసినవాడే యిలా అడుగుతున్నాడో! ఇంకా వీడికి జ్ఞానసిదియెక్కడిది

షుబే—గురువాజ్ఞ వర్తకులకు డబ్బుదగ్గిర మరియేదీ పనికిరాదండి. నేనుగూడా ఒకసారిమందలిస్తే తెరువైతే నాకొంపపోగొట్టుకుం టావా అన్నాడు. వాడితోమనకులేగాదా పరువుగాదు. ప్రొ ద్దెక్కిపోతున్నది.

వెంకో—లేవండి, అదుగో సిద్దయ్యగారువస్తున్నారు. ఇంక కలిసి వెళ్లుదాము.

(అప్పుడు సిద్దయ్య తావళముత్రిప్పుచు
ప్రవేశించుచున్నాడు)

సిద్ద—(వెంకోబారావుపంతులుగారి పాదములమీఁదబడి, అయన అరికాలుగోకి, నెత్తినజల్లుకొని) తూర్పువీధియోగిమునలను అవచ్చిన యోగిని యివాళ యెగరగొట్టుతాడట. „ రానీ యివాళచూస్తాను” అని కేకలువేస్తున్నాడట.

వెంకో—షుబేదారుగారూ! పదండి, చూద్దాము వాండ్లమొగము వాండ్లకేమితెలుసు. మాషుబేదారుగారి ప్రశ్నలకొకటికి జవాబు చెప్పిగెలిస్తేగద! వారిప్రజ్ఞసాగటము.

సిద్ద—నిజమేమర్చిపోయినాను. వెనుక కలకత్తాయోగివచ్చినప్పుడు కూడా మనషుబేదారుగారే వోడించారు. ఈయనకు సభాకంపము లేదు. అందుకనె యెంతెంతవాండ్లని యిట్టెబుట్టలో పెట్టుతారు. ఆలోచించుకుందాముపట్టండి - ఏప్రశ్నలడిగితేబాగా వుంటుందో?

షుబే—దీనికింత సేపాలోచన యెందుకండీ? అసలు విత్తుముందో చెట్టుముందో చెప్పమనండి చూస్తాను- అతను విత్తుముందంటే నేచెట్టుముందంటాను. చెట్టుముందంటే విత్తుముందంటాను.

వెంకో—అయితే షుబేదారుగారూ! చెట్టుకశ్యపప్రజాపతి సంతానమంటే.

షుబే—కశ్యపప్రజాపతియెవడు- కశ్యపన్న? “అంతాబ్రహ్మమయం యీజగమంతా నాదమయం” అనియుండగా ఆకశ్యపన్న యెవడని అడగనూ! ఇది ఒక్కటేనా ఇలాంటివిలక్షలొంభయివున్నవి. కర్మముందా జీవుడుముందా! ఆయన అది ముందంటే నే యిదిముందంటాను

వెంక—దానికి ఆయన. ‘ సర్వంమిథ్య బ్రహ్మసత్యం ’ అంటే-

షుబే.—అలాయితే— గుర్వాజ్ఞ. సర్వంమిధ్య అయితే నీవు మిధ్యే నీ అవధూతత్వముమిధ్యే అని యెగరగొట్టివేస్తాను. ఏవిధంగానైనా యీమహాయోగివల్ల మనకు చాలా లాభంవుంది. ఆయన పక్షమే మాట్లాడుదాము రండి. ఇందులో యేదయినా డావువస్తే పాపము విశాలాక్షమ్మగారికి యేదయినమంచి నగ కొనిపెట్టుదాము. ప్రొద్దెక్కి పోతున్నది. జనంబాగానే పాగింది.

సిద్ధా—మన విశాలాక్షివుంటే యీపాటికివచ్చేదే.

వెంకో—విశాలాక్షి వూళ్ళో లేదు. మూడురోజులైంది రాజమహేంద్రవరంవెళ్ళి ఇవాళవచ్చివుండాలి.

షుబే—విశాలాక్షిగారివల్లనే మనమతం యింతబాగావ్యాపించడానికికారణము. మనసమాజములోనికి ఆవిడెరాకపూర్వము మనముముగ్గురముతప్ప నాలుగోమనిషేలేదు.

వెంకో—విశాలాక్షి మంచివేద్పరి చూశావుగావూ మొన్న కత్తులపోనులోపెట్టినట్లు జాగ్రత్తగా బయిటికిరానియ్యకుండా వుంచినవీరయ్యగారి కూతురిని యెలాతీసుకవచ్చిందో ?

షుబే—అవునుమనవల్ల ఆమెకులాభం. ఆమెవల్ల మనకూలాభం మొన్నమానానికి మొన్న నాలుగు నెలలక్రిందట ఆమెకువచ్చిన ఆపదకు మనసిద్ధయ్యలేకపోతే యీపాటికి కులంలోనించి వెలివేసేవారే.

వెంకో—వెలివేసేవాడెవడండీ ఒకడు వెలివేస్తేవినేవాడెవడు?

షుబే—మీలోశంకరాచార్యులు వున్నాడంటగా. ఆయనమీ అందరికీ గురువంట.

వెంకో—మాకూశంకరాచారికీ పీర్లపండుగకు గోకులాష్టమికి యెంత సంబంధమో అంతేసంబంధం నాకు నేనేగురువును షుబేదారూ అహంబ్రహ్మాస్మి మరచిపోయినావూ ?

షుబే..గుర్వాజ్ఞ. సెలవుప్రకారం. ఆయినా కదుపూ గటాని అయి

తేలోకులు వ్రాయకుంటారా ?

వెంకో—ఇంకా అలా అనంటిబాగుంది. సిద్ధాయుష్య వాళ్లోనెప్పా వ్రుగావేం ?

సిద్ధ—జ్ఞాపకంచేశారు గనుక చెప్పుతాను- ఆవిడొక్కేగాదు. ఇంకొక బ్రాహ్మణవిధవకుగూడా నాదగ్గరనుంచి మందు పట్టుకువెళ్ళింది. ఎంతమహావేదాంతినివలె నటిస్తుందనుకున్నారు ?

వెంకో—మనము నటించడములేదూ. మనశిష్యురాలుగాదూ ఆవిడె మట్టుకు వడవండి తోటలో అప్పుడేజనంనిండిపోయినారు.

సిద్ధ—అదుగో వంతెనదగ్గర వచ్చేదిమనవిశాలాక్షిగాదూ ?

వెంకో—(వెనుకకుజూచి) వస్తే ఆవిడవెనకనుంచివస్తుంది మనంముందు వెడదాంపదండి. ఆవిడా మనమూ కలిసివెళ్ళుతుంటే నలుగురికి అనుమానంగావుంటుంది.

శుబే—నిజమేపదండి. మనము వెళ్ళిముందు దర్శనము చేద్దాము.

[అప్పుడువిశాలాక్షియు, సుందరముయు వచ్చుచున్నారు]

విశా—సుందరం ! ఎంతవ్యర్థురాలవే ! ఇంట్లోరాత్రిపగళ్ళు వంటచెయ్యటముతప్ప మరేదియెరగవు జన్మతరించేసంగతి చూసుకోవుగదా ! ఈ అన్నలు, తమ్ములు, తల్లిదండ్రి అప్పుడుపనికివస్తారనుకున్నావా యేమిటి? ఎవరిదారివారిదే.

సుంద—నేనేమీవ్రాసుపోవటములేదు. పనిపాట అయినతర్వాత రామరామా అనిబియ్యము లెక్కపెడుతుంటాను. నాలుగుసార్లు ఆ బియ్యము బ్రాహ్మలకు సంతర్పణచేశాను

విశా—ఇదాజ్ఞానమంటే ? సరే (పెదవివిరచి) కర్మకాండవలనఫలము లేదు. ఇంతభగవద్గీతలు చదువుకోవాలి తారకమంత్రము వుపదేశముగావాలి యోగధారణ నేర్చుకోవాలి. అదిగానిబియ్యము లెక్క, సంతర్పణలువా జ్ఞానమార్గాలు ?

సుంద—మా అన్నయ్యతో చెపితే యెవరిదగ్గరకూ వెళ్ళనియ్యడు.

విశా— జ్ఞానబోధకులోకములో యన్నీ ఆటంకాలే. ఎవరిజన్మతరించ దానికివారు చేసుకోనేవి ఒకరితో చెప్పా చేసుకోవటము?

సుంద— అందుకేగా ఈమహాయోగి దగ్గరకు వెళ్ళుతున్నాము.

విశా— ఈయన దర్శనలాభమేగాని యీ అడవిలో జ్ఞానబోధ, ఉపదేశాలుసాగవు- నీవునిజంగా బాగుపడాలని మనసుంటే చెప్పు ఒకనాడు వెంకోజీపంతులుగారి దగ్గరకుతీసుకువెళ్ళుతాను-

సుంద— మాకాయన దగ్గరబంధువుడు- ఆయన యెదట పడతానా? ఇక్కడికి మా ఆయనపోయినవనాలుగేండ్లనుంచీ నేనెవరికంటా పడలేదు- ఇవాళసంఘమువీద యెవరుచూస్తారనివచ్చాను.

విశా— బంధువుడయితేయేమి? ఆయన కీలోకమందు యిష్టమే లేదు- వారికేమనిషిలాగు అగపడతారుగాని నిజముగా నిస్సంగులు. ఎవ్వరితోను చెప్పరు- మాసంఘములో నెందరున్నారో యెవరికితెలుసును? అయ్యగారు యోగముపట్టితే భూమికి నిలివిడెత్తున లేస్తారు- క్షణములో పసుపుపిండి బంగారముచేస్తారు- ఆయనకేమి మహానుభావులు.

సుంద— ఆయన బంగారము చేస్తే ఆయనభార్య లక్ష్మమ్మ డబ్బంతా పాడుచేస్తున్నారని రోజూ అఘోరిస్తుంది యెందుకని?

విశా— ఆవిడెవట్టి అవకతోకమనిషి ఆయన వొక్కనాడుబంగారము చేసేటప్పటికే, రోజూ చెయ్యమని పట్టుకుంది- మహాత్ములకుభార్యలయందును సంతానమునందును మమకారముండదు-

సుంద— అదుగో అంతా వెళ్ళుతున్నారు మనముగూడా వెళ్ళుదాము పద- ఆనకమాట్లాడుకోవచ్చును.

(అప్పుడు అవధూతయు, శిష్యుడు కృష్ణారావును
ప్రవేశించుచున్నారు)

కృష్ణా— మనమేముందుగా వెళ్ళితేలోకులకు మనయందుగౌరవముతగ్గి

పోతుంది- ఆమఠంవారు బహుశః యింకా వచ్చియుండరేమో? నన్నింత తొందరపెట్టి తీసుకువచ్చినారు-

అవ—షుబేదారు పంతులుగారు ౧౦ గంటలకే వెళ్ళినట్లు తెలిసింది. మళ్ళీయాయనను కూడా భ్రష్టుచేస్తారు కాంబోలు- వారంతా పరమానందయ్యగారి శిష్యులు.

కృష్ణా—ఇదుగో చూశారా! విశాలాక్షమ్మగారిని. ఎల్లా వెళ్లుతూవుందో?

అవ—అయితే సరే ఆ పంతులు, వారంతా అక్కడికి వెళ్ళేవుంటారు. వారు వెళ్ళకపోతే యీవిదెబములు చేరదు-

కృష్ణా—ఈమే సుమండీ! పంతులవారి మఠంలో వున్న మోహినీయంత్రం. ఈమెకూడా గురుమంత్రవుపదేశం చేస్తుందట-

అవ—నాకు తెలుసును లెండి! అదుగో యెవరో చిన్నదాన్ని కూడా తీసుకుని బయలుదేరిందే!

కృష్ణా—ఆమె రామన్న పంతులుగారి కుమార్తె. ఎన్నడూ వచ్చేది కాదే కొంపతీసి ఆపిల్లనుగూడా సానికెలో చెయ్యి వేయించింది కాంబోలు.

అవ—లోకమంతా మాయవేదాంతములోపడి మునిగిపోతున్నది క్రిష్ణారావుగారూ! పంతులూ, షుబేదారు, జంగము సిద్దయ్యా అంతా కలిసి తింటారట యేమిపాపముయ్యా!

కృష్ణా—చిత్తము వాండ్లు రాత్రిళ్ళు తప్పతాగి 'తారకమంత్రము కోరికదొరికెను' అని తందనాలాడుతారండి. జాతివివక్షత, నీచయే మీ లేదండి. మొదట స్త్రీపురుషవివక్షత పనికిరాదట. తరువాత కులగోత్రములు లేవట.

అవ—అందుచేమాట అటుంచనీ బ్రాహ్మణుండాకొడుకుగదా పంతులుకేమి తెలుసు.

కృష్ణా—మోహినీయంత్రానికి లోబడ్డాడండి, ఎప్పటికైనా ఆవిశాలాక్షిని పట్టుకుంటే యిది అంతా బైటపడుతుందండీ!

అన— కలిమాయ ఎవ్వఁడాపగలఁడు. అయితేమనము వెళ్ళవలసిందేనా,

కృ— నేత్రోత్సవముగా చూచి రావచ్చునుగదా! వీరితో మనకేమి మహాయోగిదర్శనముగదా ముఖ్యము. జనంచాలాచేరింది.

అవ— ఒకప్పుడు కొందఱు దుర్మార్గులు మాయవేషము వేసుకొనికూడా ప్రజలను మోసబుచ్చుతారుసుమీ!

కృష్ణా— తమరన్నది నిజమేగాని యిదిమట్టుకు అలా అయివుండదు. త్వరగారండి అక్షతలదారినుంచి వెడదాము.

విశా— సుందరం. వదుఁడు అదుగో అవధూతచూశావా? ఈయన వట్టిదొంగ ఉపదేశాలుచేస్తానని డబ్బులాగుతాడు. ఎప్పుడైనా యీయనదగ్గిరకు వెళ్ళేవుసుమీ.

సుంద— అవధూత అంటే ఆవుద్యోగస్థులకు అందటికీ గ్రంథాలుచెప్పేఆయనేనా? అయనమంచివాడంటారే చాలామంది.

విశా— వాడిమంచి మండిపోయినట్టేవుందిలే. ముందు నిర్మలముగా చొప్పించి తగువాంత బోగందిలాగినట్టు డబ్బుగుంజుతాడు.

సుంద— ఈ వేదాంతాలలోకి దిగానని తెలిస్తే మావాళ్లునన్ను వాతిపెట్టుతారు. ఇదంతా వట్టిమాయంట మొన్న వీరయ్యగారి కూతురిని యెవరో వేదాంతము నేర్పుతామని తీసుకువెళ్ళారంట ఆమాట మానాన్నగారికి తెలిసినప్పటినుండీ నన్నుమరీ అవలికి యివతలికి దాటనియ్యటములేదు.

విశా— మావాండ్లకబుద్ధికేమిలే! ఎప్పుడో లోకము మునుగుతుందంటే యిప్పుడేమునిగిందంటారు- ఏమయినాసరేగాని ఆ అవధూతదగ్గరకుమట్టుకు వెళ్ళకు.

సుంద— నాకెందుకు అసలు మావాళ్ళు నన్ను గడప దాటనియ్యరు. ఇవాళంటే ఎలాగో తెప్పరించుకొనివచ్చాను.

విశా— అదుగో చూశావా ఆయనేమహాయోగి నమస్కారము చెయి.

శ్లో॥ గురుర్బ్రహ్మా గురుర్విష్ణుర్గురుర్దేవో మహేశ్వరః।
గురుస్సాక్షాత్పరబ్రహ్మ తస్మై శ్రీగురవే నమః॥
(అనిచదివి దవడలు వాయించుకొనుచు.)

ఇలారా! ఇక్కడకూర్చో నేను షుబేదారుగారితో మాట్లాడి వస్తాను

విశా—(షుబేదారు చెవిలో నేమియో చెప్పుచున్నది.)

షుబే—[ఆ తటకలయజామాను పంతులుగారి చెవిలో చెప్పి వీరాస్వామినిగోరి] అదుగో ఆ పాపుకోళ్ళ ఆయనే అధూత! చూశారా! ఆయనకు ఉద్యోగస్థులు నెలనెలకు జీతాలు ముడుపుగట్టి పంపుతారు నెలకొక డిప్టీకలెక్టరు జీతమంత వసూలౌతుంది ఏదోయిలా డాబుమీఁద కొట్టుకొస్తున్నాఁడు.

వీరా—(తనలో) ఆయన నిజముగా వేదాంతివలెనున్నాఁడు జనులకుగూడా ఆయనయందే గౌరవమున్నట్టు తోచుచున్నది నేనీపాడుషుబేదారును పట్టుకున్నాను ఎంతసేపుచూచినా జనము, అరటిపండ్లేగాని రూపాయలు రావడము లేదు. [(ప్రకాశముగా) అంతా తమదేభారము. ఇంకా పాదపూజలు యేమీంలేదు.

షుబే—ఇదుగో యిప్పుడే వస్తవి వుండండి. ముందు స్త్రీలారంభించిచేగాని బాగాసాగదు. (రహస్యముగా) తమదగ్గర నాలుగు రూపాయలుంటే యియ్యండి మాశిష్యురాలి చేతచేయిస్తాను.

వీరా—[తనలో] ఏమీరాకపోగా వున్నవి నాలుగూ పూడతకేమో? జనముచూస్తే కడుపునిండుతుంది. అయినా యిచ్చిచూస్తాను. [(ప్రకాశముగా] ఇవిగో (అందిచ్చుచున్నాఁడు.]

షుబే—విశాలాక్షిగారా! పాదపూజచేస్తారేమి? చిత్తముచెయ్యండి [విశాలాక్షి పాదముముట్టుకొనఁగానే యోగిచక్కిలిగింతచేత నవ్వుచున్నాఁడు)

కృష్ణా—చిత్తగించారా! విశాలాక్షి పాదపూజకు యోగి ఎలాగవచ్చుచున్నాఁడో!

అవ—యదార్థము మహానుభావులకు తెలియకపోదు.

వీరా—[యోగివంక జూచి కన్నుగీటుచున్నాఁడు]

యోగి—[వీరాస్వామివంక బిక్కమొగముతోఁ జూచుచున్నాఁడు]

[అంతట స్త్రీలనేకులు పాదపూజఁ జేయుచున్నారు,

యోగి—(తనలో) డబ్బువస్తూవున్నది గాని డబ్బుతో పాటు నాకు మూర్ఛకూడా వచ్చేటట్టున్నది ఇక్కడికి ౧౨ గంటలైనది తెల్లవారుజామున యేమితిన్నానో గాని మళ్ళీ యేమీ లేదు నేను లేవవలెనని యెన్నిసార్లు చెప్పినా అతఁడు కోపపడుతున్నాఁడు ఈమాట అడిగిచూస్తాను.

[అని వీరాస్వామిని బతిమాలుచు చేతులుజాపుచున్నాఁడు]

షుబే—వీరాస్వామిగారూ! యోగిగారు యేమిటి అడుగుతున్నారు?

వీరా—అది అడగటము కాదు. జనులయొక్క దుస్థితికి జాలిపడి మధ్యమధ్య భగవంతుని వేడుకొనుచుండుట వారికివాడుకలెండి.

యోగి—(తనలో) నేను బతిమాలినా అతఁడేదో మిష పెట్టిచెప్పివేసినాడు నన్ను లేవనిచ్చే యెత్తులేదు ఆకలికి ఆగలేకుండావున్నాను అడిగిచూస్తాను [ప్రకాశముగాఁ జేతితోఁ బొట్టజూపుచు దైన్యము నభినయించుచున్నాఁడు.]

వెంకో—షుబేదారుగారూ! పాపము వారికి పాలు, శక్కర. కలిపి ఇయ్యండి. దాహముపుచ్చుకుంటారు.

వీరా—[అడ్డపడి, ఏమిమీ అవివేకము! మహాయోగుల సంగతులు కనుకొల్లలేకుండా వున్నారు. వారు నిరాహారులు వాయుభక్షులు, వారికేమి పాలూ పంచదార కావలయునా? ఇదా మీరు గ్రహించినది?

వెంకో.— అయ్యో! అలాకడుపుచూపుతూవుంటే కాదంటారేమి? యోగులయినా పాలుపుచ్చుకోవడము వలన తప్పులేదు.

శిద్దె—ఎప్పుడయితే నర అడవిలో తిరుగుచున్నారో అప్పుడు పాలు పుచ్చుకొనటమే ముఖ్యము. లేకపోతే మూలాధార చక్రమునకు తీక్ష్ణము కలుగుతుంది.

వీరా—అదిగాదు వారితాత్పర్యము యీపండ్లు ఫలహారములు యెందుకీపాట్టకని చెప్పుచున్నారు.

యోగి—(తనలో) అయ్యో! పాపిష్టిముండా కొడుకు నన్ను నిష్కారణముగా చంపుతున్నాడు. నోటిదగ్గరకు వచ్చినదిగదా అనుకున్న పాలు మళ్లివెనక్కులాగించాడు. నాకుకళ్ళు తిరుగుతూవున్నవని చెప్పుతాను. (ప్రకాశముగా) చేతి వ్రేలు గిర గిర త్రిప్పుచున్నాడు.

వీరా—[కన్నులుఱిమి భయపెట్టుచు ప్రకాశముగా] చిత్తము యోగములు తిరుగుచు నేయున్నవి. పాపము పెఱుగుచునేయున్నది. (అనివప్పచున్నాడు)

యోగి—(లోని కోపమునాపలేక ఇక నేనుండలేనని చేతులతో సంజ్ఞచేయుచున్నాడు)

వీరా—(డబ్బువచ్చుముండుసమయములో నాతడట్లు చేయుటసంగోపపడుచు) చిత్తము. తమరే లోకులపాపమునకు బెదరితే యిక మాకుదిక్కెవ్వరు తమరులేచివెళ్ళితే మేముగూడా తమ వెంటనే వస్తాము.

యోగి—[తనలో] ఇక నే నేమిచేయను. నే నొకవేళ లేచిపోయినా యితఁడు అందరితో నావెంటపడక మానఁడు. నాకీరోజున అన్నప్రాప్తిలేదు- భగవంతుఁడేమిచేసినను సరే. (అని దైన్యముఁ జూపుచున్నాఁడు)

వీరా—(తనలో) ఇంక పరవాలేదు కుదటపడ్డాడు- మూర్ఛరాకుండా వుంటే ధన్యుడనే (అని పాదపూజరూపాయలు పోగుచేయుచున్నాడు)

కృష్ణా—చూశారా! అప్పుడే పంతులు యేప్రకారముగ పాలు పంచదార అందిస్తున్నాడో? ఏదో మహోపాయము చేత తానులాంగదీయవలెనని ఆలోచిస్తాడు.

అవ—ఎవళ్ళ పాపాన వాళ్ళే బోతారు మానకెందుకు వూరుకుందాము

కృష్ణా—చూడండి, షుబేదారు, సిద్ధయ్యగాడు యెలా పూజారులవలె దగ్గిరకుచేరుతారో- చివరకేదో మాదర్చ్ఛేదీ చేసేట్టుకనపడుతుంది.

అవ—యోగికూడా మనమనుకొన్నంత సమర్థుడు వలె కనుపించడు. ఎంతసేపుచూచినా దైన్యముగపడుతుంది. దగ్గిరకు వెళ్ళి సంభాషించి చూడవలెనంటే మౌనవ్రతము పూనాడు.

కృష్ణా—ఆచేసేపిచ్చిగుర్తులు, వీండ్లుచెప్పే తత్త్వార్థాలు చూస్తే నాకు అనుమానంగానేవుంది. ఎలాగయినా ఒక్కసారి ఆయన సత్తువ యెంతో కనుక్కుందురూ

అవ—మనకెందుకు పోనిస్తురూ! మనమింకయింటికి వెడదామురండీ.

కృష్ణా—అలా కాదు మీరు నామనవిని ఏదైనా అడగండి.

అవ—స్వామీ! తమరీ ఆశ్రమస్వీకారము చేసి యెన్నాళ్ళయింది?

యోగి—(వీరాస్వామివంక జూచుచున్నాడు)

వీరా—[షుబేదారువంక జూచుచున్నాడు]

షుబే—(పంతులవారితో రహస్యముగా] చూశారా మళ్ళీ అవధూతగాడు ప్రేలుటకారంభించాడు.

పంతు—వాండెప్పుడు అంతే. మనము దగ్గరకూర్చున్నామని యిందాకటినుంచీ చూసిచూసి యిప్పుడు ఆగలేక లేక వచ్చాడు.

సిద్ధై—పంతులుగారూ మనకేం ఆలోచన.

షుబే — ఇదిసాగనిస్తే ఇక ప్రొద్దుగూకిందాకా ప్రశ్నలే అడుగుతాడు

పంతు — సాగనిస్తే వూళ్ళోమనకంటే యితనే యెక్కువవాడని తెలిసిపోతుంది. ఏదో ఒకయెత్తువేసి ఆపాలి.

షుబే — వుండండి. నెమ్మదిగా తోపిడికారంభించి అల్లరిచేసి చప్పట్లు కొట్టుదాము

సిద్ధా — భేష మంచి ఆలోచన. సిగ్గుపడిలేచిపోతాడు.

షుబే — [త్రోయుచు] అయ్యో తొయ్యకండి తొయ్యకండి.

సిద్ధా — తొయ్యకండి తొయ్యకండి.

పంతు — కామూష్. కామూష్ [అనికేకలువేయుచున్నాడు]

సిద్ధా — (పెద్దకల్లోలముజేసి చప్పట్లు ప్రారంభించుచున్నాడు,

సుంద — అబ్బా! యేమిటమ్మా, యీతోపిడిలో నేవుండలేను అదుగో ౩ గంటల రైలుకూడావచ్చింది. మంచువచ్చి చాలా సేపైంది. ఇంకయింటికివెళ్ళాలి- మానాన్నగారులేచేవేళయింది

విశా — వుండూ వెళ్ళుదువుగాని తోపుడుసద్దుమణుగుతుందిమళ్లీ, మనమనుకున్నట్టు ౩ గంటలకే యీయన వస్తే యిప్పటికుండేదానవా కావా?

సుంద — ౩ గంటలకైతే రాకనేపోదును. నన్ను వెళ్ళనిస్తూ నీవు రాకపోతేనానె.

విశా — పంతులుగారినిచూశావా?

సుంద — చూశా. నన్ను వెళ్ళనీ.

విశా — మరినీవు జ్ఞానబోధను యెప్పుడువస్తావో చెప్పు?

సుంద — నేనిప్పుడుచెప్పలేను. నన్ను వెళ్ళనిస్తూ. నాబట్టకొంగువిడు-

విశా — [తనలో, ఇదిమట్టుకు మన మంత్రాంగాలకు పడేటట్టులేదు. పంతులుగారెన్నాళ్ళనుండో దీనిమీద ప్రాణాలుపెట్టుకున్నారు కానీ నెమ్మదిమీద విచారించాలి. [ప్రకాశముగా] వెళ్ళుదాము పద.

వీరా—[రయిలుకూతవిని తనలో] ఆశనుమితిలేదు. ఇక్కడికివచ్చిం దేచాలును. రయిలువచ్చింది. ఇంక కపటము దాగదు. తీర్థాభా సయినతరువాత చేసేదియేమీలేదు. ముందుడబ్బు షుబేదారు కం టబడకుండా దాచేసే సాధనం చూడాలి. [ప్రకాశముగా] వుండండి పాదపూజలు సర్దుతాను.

షుబే—[దిక్కులుచూచి తనలో] ఆహా! వీరాస్వామి యీపాదపూ జలు మూటగట్టాడు. గలభాలో దాచేటట్టున్నాడు. [ప్రకాశ ముగా] అవియిప్పుడు ముట్టుకోకండి.

వీరా—[యోగివంకజూచుచున్నాడు]

వెంకో—[తనలో] అవధూతను అడగగొట్టాలి. మహావిజృంభించా డు. [ప్రకాశముగా] మంప్రశ్నలు మరొకప్పుడు చూచుకోవ చ్చును వారినికదపకండి

క్రిష్టా—తమరిక్కడ స్వాములవారితరఫున వకాల్తీ పుచ్చుకో నక్క ఱలేదు.

వెంకో—నేను అవధూతతో చెప్పుచున్నాను గానినీతో-గాదు. నీ వూరుకోవచ్చు

క్రిష్టా—అయ్యో! తమరెందుకిక్కడ పోట్లాడుకుంటారు? కక్షులూ కావేషీలువుంటే యింటిదగ్గరచూచుకోండి.

అవ—క్రిష్టారావుగారూ తమరెందుకు వారితో ప్రసంగము చేస్తారు? వారిసంగతి తెలియదా?

క్రిష్టా—తెలియకేమండి! మొన్నటికేసులో వీరిని రెండో ముద్దాయి చేర్చారట.

వెంకో—[సిద్దయ్యతో] ముందుక్రిష్టారావుగారి పొగరణుస్తురూ, అ వధూత గాడిదేముంది?

సిద్దె—మనషుబేదారు తలుచుకుంటే నిమషములో అసాధ్యపు ప్ర శ్నలువేసి పడగొట్టుతాడు.

పింకో—పిలు, షుబేదారుని-

సద్గ—(షుబేదారుతో) ప్రశ్నలడగమంటున్నారు పంతులుగారు-

షుబే—(ఆగుమని చేతితో సంజ్ఞ చేయుచుఁ బాదపూజలవంకఁ జూచుచున్నాఁడు.)

క్రిష్ణా—(యోగివంక చూచి) తమకు భార్యాశాంతి అయినదా?

యోగి—(వీరాస్వామివంకఁ జూచుచు తనలో) నాశాంతిమాటయీన కెందుకు? ఇదిచెప్పితిమా. ఇఁకనీభార్య కెన్నేండ్లనికూడా అడిగేట్టున్నాఁడు- వీరాస్వామి యేమిమాట్లాడడు- ఏమి చేయుదు? (అనికన్నులుమూసికొనుచున్నాఁడు.

వీరా—(రూపాయలను షుబేదారుకుఁ దెలియకుండఁ దీయఁజూచుచున్నాఁడు)

జను—ఏమయ్యా, పూరికే అలాగుసంశోధన కారంభించావు- మనకెందుకు? సాధులకంటె మనకెక్కువ తెలుస్తుంద నామహాయోగి-

మతికొండలు—300 ఏండ్లమాట మట్టుకు నిజంగాదు వడపారము ౮౦ ఏండ్లయినానిన్నగాలేవు-

జను—యోగసిద్ధియే యీడులో అయితే ఎన్నాళ్ళున్నా ఆకాయమే వుంటుంది అదితెలియక అపచారపుమాటలు యెందుకని దోషము వడిగట్టుకుంటావు?

కొండలు—300 యేండ్లమాటే నిజమయితే తల్లికోటయుద్ధము, రామరాజు సమాచారము తెలుసునేమో?

జను—అదితెలియకపోతే యేండ్లులేనట్టేనా! నాకు యేభయియేండ్లు ఇప్పుడుజరుగుచున్న బోయరుయుద్ధమేమిటో తెలియదు అందుకని నాకిఁక ౫౦ యేండ్లులేనట్టేనా? లేకపోతే చూచానంటే మట్టుకులాభమేమిటి?

కొండ—ఎంతసేపుచూచినా మాట్లాడడు ఇది మోసముగా వున్నది పయిగా బెజవాడరెయిలుమీఁద వస్తాడని యిదివఱకనుకున్నా

రు ఈయనపొర్లిస్తున్నే వచ్చాడు.

మఠీశోం— వుండండి వుండండి కాలవమీఁద సవారివస్తున్నది-

(అప్పుడు కాలవగట్టున జనులతోఁబరమహంసయు,
శిష్యుఁడుతామప్పయు వచ్చుచున్నారు)

క్రిష్ణా—ఎవరిదది [అని కేకవేయుచున్నాఁడు]

జను—స్వాములవారిది [అనిచెప్పుచున్నారు]

పర—ఏమిటి ఆకలకలము!

జను—మూఁడు వందలయేండ్ల మహాయోగి వచ్చి దిగాడు- తీర్థప్రజ సాగింది-

రాముప్ప—(ఆశ్చర్యపడుచు) ఎవరాయన?

పర—మనము వారిదర్శనము చేసిపోదాము-

రామ—(తనలో) ఔరా! ఎప్పుఁడోరాబట్టే యెంతో జనము వస్తుందనుకుంటే రాలేదు- ఇదియేదోవున్నది [ప్రకాశముగా] అక్కర లేదు- తమ దర్శనానికే వస్తారు- మనము బసలోకి పోదాము పదండి-

పర—అక్కర లేదు మనముపోయిచూచి తర్వాతబసలోకి పోదాము పదండి-

(అందరువచ్చుచున్నారు)

(జనులు, ఎక్కడివారక్కడ దారిఁదీయుచున్నారు)

యోగి—[వారినిఁజూచి భయఁపడి మూర్ఛబోవుచున్నాఁడు]

రామ—నమస్కారము (అనిపాదప్రణామముఁ జేయుచున్నాఁడు)

పర—(చూచి) తమదేయాశ్రమము?

క్రిష్ణా—ఈయోగి మహాయోగ సమాధిలో నున్నాఁడు అని (చూపుచున్నాఁడు)

వీరా—[దిగులుతోఁ దనలో] అయ్యో! ఇఁక నేనుదాఁటేయెత్తు లేదు. యోగిరానేవచ్చాడు పయిగా యీపాడుముండాకొడుక్కి మూర్ఛకూడా యిప్పుడేవచ్చింది ఏ ఆశ్రమమంటే యేమిచెప్పను! వారుమహా అసాధ్యులుగా నున్నారు. (ప్రకాశముగా) వారిది యోగాశ్రమము.

పర—[నవ్వుచున్నాడు)

రామ—యోగాశ్రమమని కూడా ఒక ఆశ్రమము బయలుదేరిందీ? యేమి కాలమహిమ!

వీరా—[ధైర్యముఁ దెచ్చుకొని] వారిప్పుడు మాట్లాడరు. ఇది సమాధి కాలము.

షబే—(వీరాస్వామితో, ఏమియో చెవిలో చెప్పుచున్నాఁడు.

వీరా—వుండవయ్యా? సమయం అసమయం ఎఱగవు అవతల ఎంత గంద్రగోళంగా వుంది.

షబే—ఇది బాగుంది ఇయ్యవలసినదానికి చిరాకుపడతావేం.

వీరా—[యోగినిచూపి] చూడూ ఆయన యెలా నురుగులు గ్రక్కు చున్నారో.

షబే—ఆనురుగులు గిరుగలు నాకుపనికిరావు- ఇవ్వవలసినది యిచ్చి కదులు- లేకపోతేబాగాసాగదు.

జను—[నురుగులు గ్రక్కుచు వాలిపోయినయోగి నాశ్వాసించు చున్నారు- పంగలకచ్చ అంగవస్త్రము నీడిపోవుచున్నవి]

లక్ష్మ—(పరకాయించిచూచి) [తనలో) ఇతఁడు మనవూరి వెంకన్నవలెవున్నాడు- అవును వాడూ మూర్ఛలకోసము తల గడ్డము పెంచాడు (దగ్గరకువచ్చి మొలతాడిటికికట్టియున్న తాయెత్తుచూచి,) ఆవును నిజముగావాఁడే, నోటనురుగుకూడా వస్తూవున్నది ఇది సమాధిగాదు మూర్ఛ ఇకనితనికి చన్నీళ్ళుపోయకపోతే నిజముగా సమాధికట్టవలసివచ్చేటట్టున్నది. (ప్రకాశముగా] అయ్యా

ఇది సమాధిగాదు మూర్ఛరోగము. తెండిచన్నీళ్ళు చల్లిపోతా
డు (అని అరచుచున్నాఁడు.)

వీరా—ఆఁ. ఆఁ. ఎంత అపరాధము. ఎందుకీదోషముమాటలు, ఇది
హఠయోగసిద్ధి మీకు తెలియదు (అనివాదించుచున్నాఁడు.]

లక్ష్మి—ఇతఁడు మా వెంకయ్య నే నెఱుఁగుదును ఇతఁడు యోగి కాఁడు
వల్లకాడుగాడు. [అనిదగ్గిరకువచ్చుచున్నాఁడు]

వీరా—[భయపడుచు పారిపోజూచుచున్నాఁడు.]

షుబే—(వెంటనేపోయి పట్టుకొనుచున్నాఁడు.)

లక్ష్మి—[నీళ్ళుచల్లి లేవనీయుచున్నాఁడు. యోగి నురగ గ్రక్కు-చుం
డ జనులందరు ఖిన్నులై లేచి షుబేదారు వీరాస్వామి పోట్లాట
లోనికి పోవుచున్నారు.]

వీరా—ఇందులో నీతాతసొమ్మేమీ లేదు.

షుబే—నోరుమిగిలితివా అంటేతన్ని యీడుస్తాను జాగ్రత, తరువాత
నీతాతయెవడు అడ్డమువస్తాడో చూస్తాను.

వీరా—[గుంబరించుకొని జనములోపడుచు] కొట్టుతున్నాడుకొట్టు
తున్నాఁడు (అని కేకలువేయుచున్నాఁడు)

యోగి—[చన్నీళ్ళచేతమూర్ఛదేరి లేవసత్తువలేక పడుచు తనయిల్లను
కొని] అన్నాయి గోధుంజావ గోధుంజావ ఏమేదుస్తున్నారు
ఒశేవు నీవెక్కడికెళ్ళావు [అని కేకలువేయుచున్నాఁడు]

(పరమహంస జనులు పకపకనవ్వుచున్నారు)

లక్ష్మి—(వెంకన్నచచ్చె, వెంకన్నచచ్చెనని గఁజిపోయుచు] వెంకన్నా!
యోగివెప్పుడైనావురా.

యోగి—(భయపడుచులక్ష్మయ్యనుచూచుచు గజగజవడకుచున్నాడు)

పర—పూర్వాశ్రమస్మృతి కలిగినదా?

రామ—చిత్తము కొంచెము సేపుంటే చచ్చిపోవును.

[జనులునవ్వుచున్నారు.]

లక్ష్మి—ఓరి నీయోగంకాలిపోనూ నీకీరోగంయేమిరా ఎవళ్ళైనపిచ్చ దయ్యాలకుపెట్టలేదుగద.

యోగి—(భయపడుచు నటునిటుచూచుచున్నాఁడు)

లక్ష్మి—నీకుభయంలేదు చెప్పు.

యోగి—నేనీఖర్మమేమీయెఱగను దారినితిరపతిబోతూవుంటే వీరాస్వామి అని ఒకఁడువచ్చి నీకుడబ్బువస్తుంది. నీవువూరికేకన్నులుమూసుకొని కూర్చోమన్నాఁడు.

[పరమహంస, జనులు, అవధూత అందఱునవ్వుచున్నారు.]

అవ—చూశారా కృష్ణారావుగారూ! ఎంతమాయజరిగిందో ఇదియేదో షుబేదారుచేసిన భడవాపని అయివుంటుంది

లక్ష్మి—అయితే నీవెందుకు యీతిండీతిప్పలు లేకుండా మాడి కూర్చున్నావు.

రామ—పరమహంసగారు! తమరు దయచెయ్యండి వెడదాము. [బసలోకి)

పర—కొంచెము వినోదము చూచిపోదాము మఱల యిట్టివిచిత్రములుకనుబడవు

రామ—అయ్యో! నేనెంతమూర్ఖుడను నిష్కారణముగా పాదప్రణామముచేసితిని.

పర—అందుకని చింతిల్లపనిలేదు ప్రతిజీవుఁడు భగవద్రూపుడు. కామముతో చేయని ప్రతిక్రియయు ద్విగుణీకృతఫలములిచ్చునని గదా శ్రీకృష్ణులవారుచెప్పిరి.

యోగి—నేనేమియెఱగను అదుగో ఆషుబేదారు దగ్గిరవున్న అతనిని పట్టుకుంటే అంతా తెలుస్తుంది.

లక్ష్మి—కొందఱు షుబేదారు దగ్గిరవున్న సిద్దయ్య గురువును పట్టుకొనిపోవుచున్నారు.

యోగి—అబ్బే! ఇతను కాదు- అదుగో ఆ లావుపాటి ముకా—యన
నుతీసికొనిరా

సిద్ధా— నే నేపాప మెఱఁగనయ్యా! పంతులు గారూ మాట్లాడ రేమి?

పంతు—(ఇంటికిఁ బారిపోవు చున్నాఁడు)

లక్ష్మి—ఇతఁడేనా?

యోగి—ఇతఁడే.

[అప్పుడు వెంకాయి, నాగరత్నము సాయంత్రము నీళ్ళకుబయలు దేరుచున్నారు.]

వెంకా—ఇదుగోనమ్మాయివదినా! అంతా తిరిగివస్తున్నారు- మహాతమాషాగా వుంది. ఒకళ్ళ—మాటలానస్తూ యేమిటో చూచివత్తాము.

నాగ—ఏమనుంది, ప్రొద్దునవచ్చాడన్న యోగివట్టివాఁడఁట, ఎవఁడో వకఁడు మంత్రాంగం చేసి యింత గంద్రగోళం చేశాడఁట- పోనీపద.

వెంకా—అయ్యో! జనం అంతా ఎవరో ఆయన చుట్టూవున్నారేం?

నాగ—ఆయ నే నిజమైన పరమహంసఁట.

వెంకా—చూడు చూడు. అదుగో నలుగురు మనుష్యులు పట్టుకున్నారే- అతణ్ని చూడూ! నాగరత్నం! ఇతఁడే సుమా మన్నా పంతెం దగ్గఱ తేటిపారఁజూచినవాఁడు.

నాగ—నిజమే. ఎంత అసాధ్యుఁడో! చూడు యెందరిని తెప్పించినాఁడో! గొప్పశక్తిగలవాఁడు.

లక్ష్మి—నీవెఱుఁగకపోతే అమాయకుఁడు మా వెంకన్న యింతయింద్రజాలం చెయ్యాలేడు ఏం వెంకన్నా అడగనేం.

యోగి—[హీనస్వరముతో] నీవుగాదూనన్నిందులోకిదింపింది అన్నం నీళ్ళూకూడాలేకుండా చేశావు. ముద్దల్లేమాట్లాడవేం? ఇంకా

కా యెవరో పాలూపంచదారా గూడా యిస్తే పుచ్చుకోళ్ళు లేరూ?

వీరా— రామరామ నేనేపాపమెఱుఁగను. నీవుమహాయోగివని చెప్పితే గాదూ నేనునమస్కారముచేసి దగ్గరకువచ్చింది?

యోగి— ఓరిదొంగముండాకొడకా! నీవుగాదట్రా నాకీ పంగలకఱ్ఱ తెచ్చింది?

సిద్ధా— [పంగలకఱ్ఱఁజూచి తనలో] పియ్యా! నాది యీపంగలకఱ్ఱ— ఇదియిక్కడికెలావచ్చింది. ఇప్పుడుగనుక నాదంటినా నన్నుగూడా హంగామాచేస్తారు. (ప్రకాశముగా] షుబేదారూ! ఈకఱ్ఱ యెప్పుడుతెచ్చావు?

[షుబే— చెవిలో నేమియో చెప్పుచున్నాఁడు ]

(సిద్ధా— చేతితోనోరు మూసుకొనుచున్నాఁడు.]

వీరా— పంగలకఱ్ఱ నేను చూడనే లేదు.

యోగి— పోనీనాగుడ్డలు నాకుతే- [అనిమాటలాడుచున్నాఁడు)

లక్ష్మి— [వీరాస్వామిని రెక్కలుకట్టియీడ్చుచున్నాఁడు ]

జనులు— (కలకలఃవ్వుచున్నారు.)

వీరా— [(బ్రతిమాలుకొనుచు లక్ష్మయ్యచెవిలో నేవియో చెప్పుచు) బుద్ధి వచ్చినది. [చెంపలువాయించుకొనుచున్నాఁడు)

పర— (నవ్వుచుబయలుదేరి బసకుఁ బోవుచున్నాఁడు. జనులందరున వెంటఁజనుచున్నారు)

షుబే— (పోవుచు] సిద్ధయ్యా! చూశావా! నాకెలా జరిగిందో? నాయముండాకొడుకు ప్రొద్దున్నె వచ్చి నీవు సహాయము చెయ్యాలని బ్రతిమాలుకొని సగము యిస్తానన్నాఁడు.

సిద్ధా— ఝూటాకోరు ముండాకొడుకు- ఎండటినో బుట్టలోపెట్టిస్తే మోసపోయినావేం? వూరికే మోసము గాకుండా నిష్కారణముగా నాపంగలకఱ్ఱకూడా పాడుచేస్తివి.

షుబే—ఇప్పుడుమనం యేంచేస్తే వాఁడుచిక్కు—తాడో చూస్తా?

సిద్ధా—నీపుణ్యమాయిరిగాని ఇఁకవాణ్ని వదిలిపెట్టు—పైగామనం గూడా యీమాదర్బోస్టీలో చేరామని తెలిస్తే మనకున్న గౌరవం గూడా పోతుంది- ఇక్కడికయినదేమో అయింది నోరుమూసుకొని వూరుకొందాము.

షుబే—ఇవాళ నేవట్టి పాటిప్పిష్టిపైలేచాను వాఁడూ మొద్దుముండాకొడుకు ఆపెనుగులాటలో నావళ్ళంతాహూనహూనమయ్యేటట్టు పలఁగబొడిచాడు నరంనరంయిప్పుడు నలుపుపెట్టుతున్నది.

సిద్ధా—అన్నీమనమనుకున్నట్టుసాగవు. మనకెందుకు ఇఁకయిలాగంటి పాడువ్యవహారాల్లోకి దిగవద్దు. నామట్టుకు యిన్నాటి వ్యవహారముతో సిగ్గువచ్చింది. ఆకేసులోనుంచి దాటి యివతలవూడిపడితినా యిఁక వేదాంతంమాని ఇంత వైద్యమన్నా చేసుకొని బ్రతుకుతాను.

షుబే—ఇంటికిపద ఇఁక ఆపరమహంస దగ్గరకువద్దు మనపంతులుసమయంలో దాటాడు-

సిద్ధా—ఏలాగయినా బ్రాహ్మలనునమ్మగూడదు- మన్నిరకబెట్టితనుచూడూ యేలాజారేడో?

షుబే—ఆయనయెప్పుడూ అలాగేచేస్తాడు నేనంటే వూళ్లోమునుపెంతో గౌరవం- ఈవేదాంతంలోకి దిగినప్పటినుంచీ, సరిగామాయింట్లో ఆడవాళ్ళే నన్నుజూస్తే భయపడుచున్నారు.

సిద్ధా—నీవిప్పుడయినా గంజాయిమానితే బాగుపడవచ్చు-

షుబే—పంతులుతాగుడుకూడా నేర్పాడు దానితో యెక్కడడబ్బు చాలకచస్తున్నాను-

సిద్ధా—[వెనుకకుఁజూచి] జనంసద్దుగుంది అదుగోవీరాస్వామి పారిపోతున్నాఁడు.

షుబే — పిల్లిపోయి పిల్లిపోగు పిట్టగిర్రి నడన్నట్లు అలక్ష్యముగను దక్షిణవి ఆరూపాయలన్నీ.

సిద్ధా — అతఁడు వేదికమీఁద వచ్చిన పోలీసు వుద్యోగస్థుడు కాఁడుగదా!

షుబే — ఏమో నే నాయన వంక తిన్నగా చూడనే లేదు.

సిద్ధా — ఈపాటికి యింటికి పద, పొద్దుగూకుతున్నది చాలు ఇఁక యిల్లాంటివాటికి వెళ్ళవద్దు. బుద్ధివచ్చింది.

(అందఱు నిష్క్రమించుచున్నారు)

(అక్కడ బసలో పరమహంస యిట్లు చెప్పుచున్నాడు)

పర — జనులారా! ఈలోకములో మోసమొక గొప్ప వృత్తిగా నవలంబింపఁబడుచున్నది. నేఁడు కన్నులారా జరిగిన మోసమును జూచితిరి గదా? లోకలోచనమునను వివేకము లేదు. వలయునప్పుడు ధీమంతులకును వివేచనోచిత జ్ఞానము కొఱఁతగానున్నది. గడ్డము, గోశ్చ, కుంకుమబొట్టును జూచి మహాగురులనుకొని మోసపోవుచున్నారు. జనులు విపరీతముగాఁ జెప్పుకొను మాటలు కర్ణాకర్ణిగా వింటిని. అంతటపడ్డదనిన నింతటబడ్డదని లోకులూరక నమ్మి యితరులను నమ్మింపఁజూతురు. మిథ్యావేదాంతమునకు ఈ సద్యోఫలితములగుపడుచునే యున్నవి. 300. 400 ఏండ్లనాఁడు లేవు. ఎవ్వరో మిత్రులను మోసముచేయుటకే వాడుకవేసిరి. అదివ్యక్తుని మీరందఱు భ్రమపడి పోవుచున్నారు. అనేకులు దుర్మార్గులు వేదాంతమని మిషపెట్టి శుష్కదొంగలై స్త్రీలను జెఱచుచున్నారు. జనులీదురభ్యాసమును దొలగించుకొనినఁగాని సంఘాభివృద్ధి కానేరదు.

[అనినిష్క్రమించుచున్నాడు]

జనులెల్లరుఁ దాముజూచిన చిత్రకథను జెప్పుకొనుచుఁ దమతమ గృహములకుఁబోవుచున్నారు.

సంపూర్ణము.

# Ready for Sale !

## ప్రహసనములు

---

| | | |
|---|---|---|
| ౧. | చమత్కారస్నేహప్రహసనము. | ౦-౨-౦ |
| ౨. | మహామోగరహాస్యప్రహసనము. | ౦-౨-౦ |
| ౩. | విధవోద్వివాహప్రహసనము. | ౦-౨-౦ |
| ౪. | నిరపవాదప్రహసనము | ౦-౨-౦ |
| ౫. | మద్యపానప్రహసనము. | ౦-౨-౦ |
| ౬. | పల్లెటూళ్ళపట్టుదలలు. | ౦-౨-౦ |

### ప్రత్యేకము స్త్రీలకొఱకు.

| | | | |
|---|---|---|---|
| ౧. | స్త్రీలపాటలు ౧ భాగము. | ౨౪౦ పేజీలు. | ౦-౧౨-౦ |
| ౨. | స్త్రీలపాటలు ౨ భాగము. | ౨౪౦ పేజీలు. | ౦-౧౨-౦ |
| ౩. | స్త్రీలపాటలు ౩ భాగము. | ౨౪౦ పేజీలు. | ౦-౧౨-౦ |
| ౪. | కాశీమజిలీలు ౧ భాగము. | ౪౦౦ పేజీలు. | ౧-౦-౦ |
| ౫. | కాశీమజిలీలు ౨ భాగము. | ౪౦౦ పేజీలు. | ౧-౦-౦ |
| ౬. | శిశుసంజీవని. | | ౦-౪-౦ |

